# ప్రత్యంగిరా సాధన



కుర్తాళం శంకరాచార్య, జగద్గురు

**శ్రీ సిద్ధేశ్వరానందభారతీస్వామి**

# ప్రత్యంగిరా సాధన



రచయిత

పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు

## శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి

సర్వస్వామ్య సంకలితము
ప్రతులు: 1000
వెల : రు. 30/-

## ప్రతులు లభించుచోటు

ధర్మాధికారి
**స్వయంసిద్ధ కాళీపీఠము**
బి1- సి 40, 4వ లైను,
రవీంద్రనగర్, గుంటూరు-522 006.
ఫోన్ : 0863 - 2256666 -2231625.

మేనేజరు
**లలితా పీఠము**
లలితా నగర్, విశాఖపట్నం.
ఫోన్ : 5531899
(0891) 2798712

మేనేజరు
**సిద్ధేశ్వరీ పీఠము**
దత్తాత్రేయమఠం
మౌనస్వామి ఆశ్రమం
కుర్తాళం, తమిళనాడు.
ఫోన్ : 04633 - 210707

D.T.P. & Printed By
**Sri Sai Sree Printers**
Lakshmipuram 1st Line,
Near Vijaya Towers
Guntur - 522 007.
Cell : 98482 32225.

# పీఠిక



ప్రతంగిరా సాధన అత్యంత ప్రాచీనమైనది. ఈ దేవత అధర్వణ వేదంలో చాల శక్తిమంతమైనదిగా కనిపిస్తుంది. ఏ శత్రువు ఎంతటి ప్రయోగం చేసినా, దానిని నివారించటమే కాక తిరిగివెళ్లి పంపిన వానినే చంపివేసే లక్షణం ఈ విద్యలో ఉన్నది. ఆధర్వణ ఋక్కులలో ఈ మంత్రదేవతకు కేవలం తేజస్సు మాత్రమే అకృతిగా-విద్యున్మయమైన మూర్తిగా చెప్పబడింది. చాలా మంత్రాలలో బ్రహ్మశక్తిగా అంటే తపశ్శక్తిగా వర్ణనలు కనిపిస్తున్నాయి. ఇందులోని ఋఙ్మంత్రాలను వివిధ ప్రయోజనాలకు ఉపయోగించటము కూడా ఉన్నది. జ్ఞాతాజ్ఞాత శత్రువులను నాశనం చేయటానికి మాత్రమే కాక, సర్వరోగ నివారిణిగా ఈ విద్య ప్రచారంలో ఉన్నది.

తర్వాతి కాలంలో ఈ దేవతను సింహముఖం కల్గిన దానినిగా తంత్ర గ్రంథాలు వర్ణించినవి. సింహీం, సింహముఖీం-అని, సింహవాహన అని కొన్ని చోట్ల కనిపిస్తున్నది. వేదంలో మాత్రం పరకృత్యా నాశని, శత్రు సంహారిణి, రోగనివారిణియైన మహాశక్తిగా అభివర్ణితమైనది. ఈ ఋక్కులలో చివరి భాగంలో కొన్ని అధిక పాఠాలు. 45 మాత్రమే మొదటివని తర్వాతవి కాలాంతరాన చేరినవని కొందరి అభిప్రాయం.

భాగవతంలో కాశీరాజు శ్రీకృష్ణుని మీద అభిచారిక హోమం చేయించి కృత్యను ప్రయోగింప జేశాడు. అది ద్వారక మీదకు త్రోవ అంతా దహిస్తూ వెళ్ళింది. కృష్ణుడప్పుడు ద్వారకలో లేడు కాపలాగా ఉన్న సుదర్శన చక్రం అకృత్యను దహించి, అంతటితో ఊరుకోక కాశీకి వెళ్ళి పట్టణాన్ని దగ్ధం చేసింది. 12 సంవత్సరాలు వారణాసి తగలబడుతూనేఉంది. తాత్కాలికంగా విశ్వనాధుడు మందర పర్వతం మీద తలదాచుకున్నాడట! కృత్యను దహించినందువల్ల కావచ్చు - ఒక ప్రత్యంగిరా మంత్రం - సుదర్శనాస్త్ర మంత్ర సంపుటితమైనది మంత్ర శాస్త్రంలో ఉన్నది.

కన్నడ భారతంలో ఒక అద్భుతకథ ఉన్నది. పాండవులు వనవాసం చేస్తూ ఉండగా దుర్యోధనుడు కనకస్వామి అనే మాంత్రికుని పిలిపించి అభిచారిక హోమం చేయించాడు. ఆ మంత్ర వేత్త ఒక కృత్యను పుట్టించి పాండవులను చంపమని పంపించాడు. ఆ కృత్య వాళ్ళ దగ్గరకు వెళ్ళేటప్పటికి యక్ష ప్రశ్నల ఘట్టం జరుగుతున్నది. భీమార్జున నకుల సహదేవులు స్పృహ దప్పి ఉన్నారు. ధర్మరాజు యక్షుని ప్రశ్నలకు సమాధానం చెపుతున్నాడు. ఈ కృత్య పాండవులను చంపబోయింది. ఆ యక్షుడు (ధర్మదేవత) అడిగాడు - కృత్యా! ఎవరునీవు?

కృత్య - నేను అభిచారిక హోమకుండంలో మంత్ర ప్రేరణ వల్ల ఉదయించాను.

యక్షుడు - నిన్నెవరు పంపారు ? ఎందుకు ?

కృత్య - కనకస్వామి అనే మాంత్రికుడు పాండవులను చంపమని ఆజ్ఞాపించాడు.

యక్షుడు - వీళ్ళిప్పుడు నా వలయంలో ఉన్నారు. వీళ్ళను ఏమి చెయ్యాలనేది నా నిర్ణయం. నా దగ్గర ఉన్న వీళ్ళను నీవు చంపటానికి అనుమతించను వెళ్ళిపో !

కృత్య - నేను మీ తేజోవలయంలోకి ప్రవేశించలేకున్నాను. పాండవులను ఏమీ చేయలేనని తెలుసుకున్నాను. కానీ నేను చంపటానికి పుట్టాను. అదితప్పదు. ఎవరినైనా చంపాలి.

యక్షుడు - అయితే నిన్ను పంపిన వాణ్ణి చంపు - వెళ్ళిపో.

కృత్యవెళ్ళి కనకస్వామిని చంపింది. ఇటువంటి త్రిప్పికొట్టే విద్య-ప్రత్యంగిర. క్రోధ భయంకరమూర్తి. దీనిని ఉపాసించేవాడు తీవ్ర శక్తి గలవాడై ఉంటాడు. అందుకే తెలుగునాట ప్రత్యంగిర చేసేవాని పంచన ఉండవద్దన్న మాట పుట్టింది.

ఈ గ్రంథంలో ప్రత్యంగిరా సాధనలో భాగంగా, అధర్వణఋక్కులు, వాటి తాత్పర్యము ఇవ్వబడినది. తంత్ర గ్రంథాలలోని కవచము, స్తుతులు, అష్టోత్తరశత నామావళి ఇవ్వబడినది.

ఇటీవల దక్షిణదేశంలో ఒక గొప్ప నాయకురాలు ప్రత్యంగిరా యజ్ఞం చేయించటం వల్ల ఎన్నికలలో శత్రువులను ఓడించి అధికారంలోకి వచ్చిందని ప్రచారంలో ఉంది. కారణం ఏదైనా ఇప్పుడు తమిళనాడులో ప్రత్యంగిర - ఆలయాలు, పూజలు, యజ్ఞాలు ఎక్కువైనవి. మా కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠంలోను, విశాఖపట్టణ లలితా పీఠంలోను ప్రత్యంగిరా ప్రతిష్ఠలు జరిగినవి. ప్రజలు - ఈ దేవతా పూజలలో, హోమాలలో విరివిగా పాల్గొంటున్నారు. గుంటూరులోని మా స్వయం సిద్ధ కాళీ పీఠంలో దుష్ట గ్రహ, పిశాచ, రోగ బాధా నివారణకు ప్రత్యంగిరా హోమ ప్రయోగం విజయ వంతంగా నిర్వహించ బడుతున్నది.

భక్తులైన సాధకులు ప్రత్యంగిరా సాధన చేసి ఉపయోగము పొందుదురుగాక!



## అధర్వణ వేదంలోని ప్రత్యంగిరా ఋక్కులు

1) యాం కల్పయంతి నోరయః క్రూరాం కృత్యాం వధూమివ
తాం బ్రహ్మణాపనిర్ణుద్మః ప్రత్యక్ కర్తార మృచ్ఛతు

నా శత్రువులు స్త్రీ రూపముగా నున్న క్రూరమైన కృత్యగా దేనిని కల్పించినారో ఈ వేదమంత్ర శక్తి చేత దానిని వేరొక చోటికి ప్రేరేపించుము (వేరు మార్గము లేనిచో) వెనుకకు తిరిగి అది కర్తనే పొందును గాక!

2) శీర్షణ్వతీం కర్ణవతీం విషరూపాం భయంకరీం
యః ప్రాహిణో దిహాద్య త్వాం వి తం త్వం యోజ యాసుభిః

భీషణమైన స్థూలశిరస్సుతో పెద్ద చెవులతో విషమరూపముతో భయంకరివైన నిన్ను ఎవడు పంపినాడో వాని ప్రాణములను నీవు నాశనము చేయుము.

3) యేన దిష్టేహ వహసి ప్రతికూల మఘాయిని
తమే వేతో నివర్త్యైష మాస్మాన్ ఋచ్ఛో అనాగసః

పాపమును చేయుదానా! ఎవనిచేత నీవు పుట్టించబడి, విడిచి పెట్టబడి, ప్రతికూలముగా వచ్చినావో ఇక్కడనుండి తిరిగివెళ్ళి వానినే దహించుము. పాపరహితులమైన మా దగ్గరకు రావద్దు.

4) అభివర్తస్వ కర్తారం నిరస్తా స్మాభి రోజసా
ఆయురస్య నికృంతస్వ ప్రజాంచ పురుషాదిని

మా మంత్ర ప్రభావముచేత అన్యత్ర ప్రేరితవై ప్రయోగించిన వాని కభిముఖముగా వెళ్ళుము. వాని ఆయువును ఛేదించుము. మనుష్యులను తినుదానా! వాని సంతానమును నాశనము చేయుము.

5) యస్త్వా కృత్యే! చకారేహ తం త్వం గచ్ఛ పునర్నవే!
అరాతీన్ కృత్యే! నాశయ సర్వాంశ్చ యాతుధాన్యః

ఓ కృత్యా! ఎవడు నిన్నిటులు చేసి ఇక్కడకు పంపినాడో నీవు మరల క్రొత్త దానివై వానిమీదకే వెళ్ళుము. నా శత్రువులను, సమస్త రాక్షసులను కూడా నాశనము చేయుము.

6) క్షిప్రం కృత్యే! నివర్తస్వ కర్తురేవ గృహం ప్రతి
పశూం శ్చైవాస్య నాశయ వీరాం శ్చాస్య నిబర్హయ

ఓ కృత్యా! నిన్ను సృష్టించినవాని యింటికే తిరిగి శీఘ్రముగా వెళ్ళుము. వాని పశువులను, పుత్రులను మారణము చేయుము.

7) యస్త్వా కృత్యే ప్రజిఘాయ విద్వాన్ అవిదుషో గృహాన్
తస్యై వేతః పరేత్యాశు తనుం కృంధి పరుష్పరుః

కృత్యోత్పాదన సమర్థుడైన ఎవడు నిన్ను అజ్ఞానినైన నాయింటిమీదకు పంపినాడో ఓ కృత్యా! నీవు వాని మీదకే పోయి వాని శరీరములోని అంగమంగమును ఛేదింపుము.

8) ప్రతీచీం త్వాపసేధతు బ్రహ్మ రోచి ష్ణుమిత్రహా
అగ్నిశ్చ కృత్యే! రక్షోహా రిప్రహా చాజ ఏకపాత్

ఓ కృత్యా! నా కభిముఖముగా వచ్చు నిన్ను వేద మంత్రముచే ప్రకాశించువాడు, శత్రువులను చంపువాడు, రాక్షసహంత, అజుడు, ఏకపాదుడు నైన అగ్ని త్రిప్పిపంపును గాక!

9) యథా త్వాంగిరసః పూర్వే భృగవ శ్చాప సేధిరే
అత్రయశ్చ వసిష్ఠాశ్చ తథైవ త్వాప సేధిమ

పూర్వము ఆంగిరసులు, భార్గవులు, ఆత్రేయులు, వాసిష్ఠులు ఏవిధముగా నిన్ను తిప్పిపంపినారో మేముకూడా అట్లే నిన్ను అన్యత్ర పంపెదము.

10) యస్తే పరూంషి సందధౌ రథస్యేవ విభు ర్ధియా
తం గచ్ఛ తత్ర తే జనః అజ్ఞాత స్తే అయం జనః

నిన్ను పుట్టించిన ఎవడు అవయములతో - భాగములతో - రథమును పంపినట్లు నిన్ను ఇక్కడకు తోలినాడో అక్కడకే వానిమీదకే పొమ్ము. ఈ జనుడు నీకు అజ్ఞాతుడు. ఇతనిని నీవు తెలియలేవు.

11) యో నః కృత్యే! రణస్థో వా కశ్చి ద్వాన్యో భి హింసతి
తస్య త్వం ద్రో రివేద్ధోగ్నిః తనూం ముచ్ఛస్వ హేళితా

ఓ కృత్యా! నిన్ను ఉత్పాదించినయెవడు రణస్థుడు గాని ఇతరుడు గాని నన్ను హింసించునో చెట్టునందు రగిల్చబడిన అగ్నివలె అత్యంత క్రోధముతో వాని శరీరములోనికి పొమ్ము.

12) భవా శర్వా దేవహేళి మస్య తం పాపకృత్వనే
హరస్వతీ త్వంచ కృత్యే! మోచ్ఛిష స్తస్య కించన

ఓ కృత్యా! దేవ క్రోధియై నాయందు పాపమును చేయు వానిని హింసించు దానవు కమ్ము! క్రోధవతివై వానిని కొంచెముకూడా మిగిల్చక దహించుము.

13) యో నః కశ్చి ద్ద్రుహోరాతిః మనసా పృభిదాసతి
దూరస్థో వాంతికస్థో వా తస్య హృద్య మసృ క్పిబ

ఏ శత్రువు ద్రోహబుద్ధితో నాకు హింసను తలపెట్టినాడో వాడెవడైనను దగ్గర ఉన్నను లేక ఎంత దూరమున నున్నను వాని గుండె నెత్తురు త్రాగుము.

14) యేనాసి కృత్యే! ప్రహితా ధూ ర్ధియాస్మ జ్జిఘాంసయా
తస్య వ్యనచ్చావ్యనచ్ఛ హినస్తు హరసా శనిః

ఓ కృత్యా! నన్ను చంపుటకు ఎవడు నిన్ను పంపినాడో వానిని వానియింటిలోని వారిని వాని భూహిరణ్యాదులతో (సప్రాణ, అప్రాణులతో) వజ్రము (లేక పిడుగు) హింసించును గాక! దహించునుగాక!

15) యే నో శివానః పంథానః పరా యాంతి పరావతం
తై ర్దేవి రాత్ర్యాః కృత్యానో గమయ స్వానుకృంతయే

ఏవి అశివములైన మార్గములలో (పర ప్రేషిత కృత్యలు) మమ్ముగూర్చి వచ్చు చున్నవో ఆ మార్గములలోనే రాత్రి సంబంధములగు కృత్యలను మా కొరకు ఉచ్ఛేదనము చేయుము. ఖండింపుము.

16) య ద్వ్యుపైషి ద్విప దృస్మాన్ యదివైషి చతుష్పదీ
నిరస్తేతో ప్రజాస్మాభిః కర్తు రష్టాపదీ గృహాన్

మా పైకి నీవు ద్విపదివై - రెండు కాళ్ళు గల రూపముతో వచ్చు చున్నావో లేక చతుష్పదివై - నాలుగు కాళ్ళుగల ఆకృతితో వచ్చు చున్నావో - ఏమైనా మాచేత తిరస్కరించబడి ఇక్కడనుండి అష్టాపదివై ఎనిమిది కాళ్ళ భీషణ రూపముతో కర్తయొక్క గృహమునకు శీఘ్రముగా పొమ్ము.

17) యో న శ్శపా దశపతో యశ్చన నశ్శపత శ్శపాత్
వృక్షమివ విద్యుదాశు తమామూలా దనుశోషయ

ఎవడు శపించని మమ్ము శపించుచున్నాడో, ఎవడు మమ్ము దూషించుచు శపించుచున్నాడో వానిని, పిడుగు చెట్టును ఆమూలముగా దహించునట్లు దహింపుము.

18) యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి అఘాయు ర్యశ్చ నశ్శపాత్
శునే పైష్టమివ క్షామం తం ప్రత్యస్యస్వ మృత్యవే

ఎవనిని మేము ద్వేషించు చున్నామో, ఎవడు మమ్ము ద్వేషించు చున్నాడో, ఎవడు మమ్ము పాపాత్ముడై శపించు చున్నాడో కుక్కకు భక్ష్యమును పడవేసినట్లుగా వానిని మృత్యువునకు పడవేయుము.

19) యశ్చ సాపత్న శ్శపథో యశ్చ జామీ శపాతి నః
బ్రహ్మోచ యత్ క్రుద్ధ శ్శపాత్ సర్వం తత్ కృంధ్యధస్పదం

నా తల్లి సవతి కొడుకులుగాని, నా భగిని-సోదరిగాని, లేక నాయందు కోపించిన బ్రాహ్మణుడుగాని ఎవరు నన్ను శపించినను ఆ శాపము నన్నంటకుండా నాశనము కావింపుము.

20) సబంధు శ్చాసబంధుశ్చ యో అస్మాన్ అభిదాసతి
తస్య త్వం భిం ద్యధిష్ఠాయ పదా విస్ఫూర్య తచ్ఛిరః

సహోపనయన, సహాధ్యయనాది సంబంధములు కలవాడుగాని, లేనివాడుగాని ఎవడు మా నాశనము కోరుచున్నాడో వాని గుండెపై కాలుపెట్టి తల పగులగొట్టుము.

21) అభిప్రేహి సహస్రాక్షం యుక్త్వాశు శపథం రథే
శత్రూ నన్విచ్ఛతీ కృత్యే! వృకీ వావివతో గృహాన్

బహు చక్రములు గల రథము నెక్కి శత్రువుల నన్వేషించుచున్న కృత్యా! తోడేలు గొర్రెల శాలలో ప్రవేశించి వానిని చంపినట్లు వేగముగా పరకృత్యమును నాశనము చేయుము.

22) పరిణో వృఙ్ధి శపథాన్ దహ న్నగ్ని రివ హ్రదం
శత్రూ నేవాభితో జహి దివ్యా వృక్షమి వాశనిః

అడవిని దహించు కార్చిచ్చు మధ్యలోని కొలనును ఏవిధముగా వర్జించునో అటులే శత్రువులు నాకు చేయు పాప కార్యములు నన్నంటకుండా చేసి ఆకాశమునుండి పడిన పిడుగు, చెట్టు నెట్లు దహించునో నా శత్రువుల నట్లే చంపివేయుము.

23) శత్రూన్ మే ప్రోథ శపథాన్ కృత్యాశ్చ సుహృదో ఉసుహృాన్
జిహ్మో శ్మక్ష్ణాశ్చ దుర్హృదః సమిద్ధం జాత వేదసం

నా శత్రువులను వారి శాపములను వారి కృత్యలను, వారి మిత్రులను ప్రాణహరణముచేసి తాడింపుము. కుటిలులై పైకి మెత్తగా కనిపించు ఆదుష్టచిత్తులందరిపైన మండే నిప్పవేసి తగులపెట్టుము.

24) అసపత్నం పురస్తాన్నః శివం దక్షిణత స్కృధి
అభయం సతతం పశ్చాత్ భద్ర ముత్తరతో గృహే

మా యింటికి తూర్పున శత్రువులు లేకుందురుగాక! దక్షిణమున శుభమును చేయుము. ఎప్పడును పడమట భయము లేకుండును గాక! అటులే ఉత్తరదిక్కున భద్రమగునుగాక!

25) పరేహి కృత్యే మాతిష్ఠ విద్ధస్యేవ పదం నయ
మృగస్య హి మృగారిః ప్రణత్వా నిష్కర్తు మర్హతి

పరులు పంపిన కృత్యా! ఇక్కడ క్షణముకూడ నిలువవద్దు. బాణముచే కొట్టబడిన జంతువునుండి కారు నెత్తురును బట్టి వేటకాడు ఏ విధముగా దానిని గుర్తించునో అట్లులే మంత్రబలముచే శక్తులమైన మాకు నమస్కరించి పంపినవాని మీదకే వెళ్ళుము.

26) అభ్యక్తాక్తా స్వలంకృతా సర్వం నో దురితం వహ
జానీధా శ్చైవ కృత్యానాం కర్తౄన్ నృౄన్ పాపచేతసః

సుగంధ తైలాదుల అనులేపనము గలిగి అంజనాదులచే అలంకరింప బడిన దానా! నాయందు చేయబడిన పాపకార్యమును అన్యత్ర పొందింపుము. మాపైకి కృత్యలను పంపించిన మనుష్యులను (పాముజాడ పాముకు తెలిసినట్లు) నీ వెరుగుదువు.

27) యధా హంతి పురాసీనం తథైవే ష్వాశుకృ న్నరః
తథా త్వయా యుజా వయం నికృద్మ స్థాస్ను జంగమం

శత్రువు తనపైకి వదలిన బాణమును లేక ఆయుధమును హస్తలాఘవము కలవాడే విధముగా పట్టుకొని శత్రువుపైకి విసరునో అదేవిధముగా నీసహకారముచేత మాపైకి వచ్చిన దానిని త్రిప్పివేసి వైరుల స్థావర జంగమ పరివారమును నాశనము చేసెదము.

28) ఉత్తి ష్ఠైవ పరే హీతో అజ్ఞాతే కిమిహేచ్ఛసి
గ్రీవాస్తే కృత్యే పాదౌ చాభికృత్స్యామి విద్రవ

ఓ కృత్యా! వెంటనే ఇక్కడనుండి పరాభవముతో లేచిపొమ్ము! నా సంగతి నీకు తెలియదు. నాప్రభావము నీవెరుగవు. నీవేమి చేయవలెనని కోరుచున్నావు? ఇంత చెప్పినా పోకపోతే నీగొంతు కోసెదను. నీకాళ్ళు నరికెదను. ఇతర అవయవములను ఛేదించెదను. వెంటనే పరుగెత్తి పొమ్ము.

29) స్వాయసా స్సంతి నో ఉసయో విద్మచైవ పరూంషితే
తైస్తై ర్నికృద్మ స్తాన్యుగ్రే యది నో జీవయ స్యరీన్

ఓ భీషణీ! క్రోధ రూపిణీ! నీమర్మములు, వద్ధతంలు, శస్త్రములు, మేమెరుగుదుము. మాకును సుతీక్షణములైన ఇనుప కత్తులున్నవి. నీవు వెనుకకు వెళ్లి మా శత్రువులను చంపక ప్రాణములతో ఉంచినచో ఆయా ఆయుధములతో నీ అవయవములను ఛేదించెదము.

30) మాస్యోచ్ఛిషో ద్విపదం మోత కించి చ్చతుష్పదం
మాజ్ఞాతీ ననుజాన్ పూర్వాన్ మావేశి ప్రతివేశినౌ

నా శత్రువు యొక్క యింటిలోని పురుషులను, స్త్రీలను, జంతువులను, జ్ఞాతులను, తమ్ములను, వారిముందువారిని, వారి యిండ్లలోని, వారికి సంబంధించిన పురారామములందలి సర్వజనులను ఒక్కరినికూడా మిగుల్చక చంపివేయుము.

31) శత్రూయతా ప్రహితాసి మాం యేనాభి యథా యతః
తత స్తథా త్వా నుదతు యో య మంత ర్మయి స్థితః

ఎక్కడనుండి ఏవిధముగా ఎవనిచేత శత్రుత్వముతో నాపైకి పంపబడినావో నాహృదయాంతరాళమునందు వర్తించెడి పరమాత్మ నిన్ను ఉత్పాదించిన వాని మీదకు - అక్కడకు- అటులే ప్రేరేపించును గాక!

32) ఏవం త్వం నికృతాస్మాభిః బ్రహ్మణా దేవి సర్వశః
య థైవ మాశ్వితో గత్వా పాపధీ నేవ నో జహి

మేము చేసిన జప తపశ్శక్తి చేత తిరస్కరించబడి మా నుండి మా స్థలములనుండి పొమ్ము. ఇక్కడనుండి వేగముగా పోయి మాయందు పాపబుద్ధులైనవారిని అక్కడనే చంపుము.

33) యథా విద్యుద్ధతో వృక్షః ఆమూలా దనుశుష్యతి
ఏవ సప్రతి శుష్యతు యో మే పాపం చికీర్షతి

పిడుగుపడిన చెట్టు మొదలునుండి ఎటులు మాడిపోవునో అటులే నాకు పాపము చేయగోరువాడు మాడిపోవునుగాక!

34) యథా ప్రతిశుకో భూత్వా తమేవ ప్రతిధావతి
పాపం తమేవ ధావతు ద్వేష్టారం ప్రతిగచ్ఛతు

లోకములో రాజక్రీడనార్థము శుకాది పక్షులను మాలిమిచేసి శిక్షణయిచ్చి ఇతరశుకములను పట్టితెచ్చుటకు పంపెదరు. అవి అటులే వెళ్ళి తమజాతివానినే అక్రమించి పట్టి తెచ్చును. అవిధముగానే నాశత్రువుచేత నాపై చేయబడిన ప్రయోగము నన్ను ద్వేషించినవానిమీదకే పోవునుగాక!

35) యోనిస్వో అరుణో యశ్చ యోహి నిష్ట్యో జిఘాంసతి
దేవా స్తం సర్వే ధూర్వంతు బ్రహ్మ వర్మ మమాంతరం

ఏ దరిద్రుడు, ఖలుడు, చండాలుడు నన్ను చంపుటకు కోరుచున్నాడో వానిని సర్వదేవతలు హింసింతురుగాక! నాహృదయములోని బ్రహ్మమే నాకు రక్షాకవచము.

36) ఊత్వా మందంతు స్తోమాః కృణుష్వ రాధో అద్రివః
అవ బ్రహ్మ ద్విషో జహి

బ్రహ్మ! నిన్ను మా యజ్ఞములు సంతోష పెట్టును గాక! భానురుడవై మాకోరికలను తీర్చుము. మమ్ము రక్షింపుము! మాశత్రువులను నాశనము చేయుము.

37) యో మే కరోతి ప్రద్వారే యోగారే యో నివేశనే
యో మే కేశనఖే కుర్యా దంజనే దంతధావనే

శత్రువులపై ప్రయోగము చేయువారు వారు తొక్కిన మట్టిని, యింటిలోని వస్తువును, అవ్యక్తి యొక్క జుట్టు, గోళ్ళు, ధరించేకాటుక, పండ్లు తోమిన పుల్లలు మొదలైన వానిని సంపాదించి పుత్తళీ ప్రయోగాదులు చేయుదురు. అంతేగాక ప్రయోగ వస్తువులను శత్రువు ఇంటిలో ద్వారము క్రింద లేక పైన నివసించు గదిలో పెట్టుదురు. అట్టివానివలన నాకు అపకారము జరుగ కుండునుగాక!

38) ప్రతిసర ప్రతిధావ కుమారీవ పితుర్గృహాన్
మూర్ధాన మేషాం స్ఫోటయ పదమేషాం కులే కృధి

కుమార్తె తండ్రి ఇంటికి ఎటుల వెళ్ళునో ఓ కృత్యా! నీ వటులే నిన్ను పంపిన వాని మీదకు పరిగెత్తుకుంటూ వెళ్ళుము. వాని తల పగుల గొట్టుము వాని కాళ్ళు విరగ గొట్టుము. వాని స్థానము నాశనము చేయుము.

39) యేద్రుహ్యు ఋజవే మహ్య మగ్నే కదా ధియో దుర్మదా అశ్మనాసః
ఆబద్ధ్యైతాం చ్ఛోచిషా విధ్యతంతూన్ వైవస్వతస్య సదనం నయస్వ

ఏ ద్రోహులు దుర్మద బుద్ధితో నాప్రాణములు తీయుటకు ఆలోచించు చున్నారో ప్రయోగములు చేయుచున్నారో వారిని త్రాళ్ళతో కట్టివేసి మంటపెట్టి కాల్చి యమునింటికి నడుపుము.

40) యే నో రయిం దుశ్చరితాసో అగ్నే జుహు ర్మర్తాసో అనృతం వదంతః
తేషాం వపూం ష్యర్చిషా జాతవేదః శుష్కంను వృక్ష మభిసందహస్వ

మమ్ము, మా సంపదలను నాశనము చేయుటకు అబద్ధములాడు ఏదుశ్చరిత్రులు హోమము చేయుచున్నారో ఓ అగ్నీ! వారి శరీరములకు మంటపెట్టి ఎండిన చెట్టునువలె తగల బెట్టుము.

41) అగ్న్యాస్యే ఘోరరూపేచ విషరూపే వినాశిని
జృంభితా ప్రతిగృహ్ణీష్వ స్వయ మాదాయ చాద్భుతం

ఓ అగ్నిముఖీ! విషమమైన భయంకర రూపము గలదానా! వినాశకశక్తీ! నీవు విజృంభించి అద్భుతము చేసి నా శత్రువులను ప్రతిగ్రహింపుము.

42) త్వమింద్రో యమో వరుణః త్వ మాపోగ్ని రథానిలః
త్వం బ్రహ్మాచైవ రుద్రశ్చ త్వష్టాచైవ ప్రజాపతిః

నీవే ఇంద్రుడవు, యముడవు, వరుణుడవు. నీరు, నిప్పు, గాలి నీవే! నీవే బ్రహ్మావు, రుద్రుడవుకూడ. నీవే త్వష్టవు, ప్రజాపతివి.

43) ఆవర్తధ్వం నివర్తధ్వం ఋతవః పరివత్సరాః
అహోరాత్రా స్తథాబ్దాశ్చ త్వం దిశః ప్రదిశశ్చమే

నీవే కాలమును ఆవర్తింతువు, నివర్తింతువు. పగళ్ళు, రాత్రులు, ఋతువులు, సంవత్సరములు నీఅధీనములు. నీవే నాకు దిక్కులు- విదిక్కులు-అన్నింటిని నాకు కావలసినట్లు చేయుము.

44) త్వమింద్రం యమం వరుణం సోమ మగ్ని మథానిలం
అత్రాహృత్య పశూంశ్చైతా నుత్పాదయసి చాద్భుతం

నీవు ఇంద్రుని, యముని వరుణుని, సోముని, అగ్నిని, వాయుదేవుని ఇక్కడకు తెచ్చి ఏసంపదలనైనా, జీవజాలమునైనా అద్భుతముగా సృష్టించెదవు.

45) యే మే దమే దారుగర్భే శయానం ధియా సహితం పురుషం నిజఘ్నుః
కుంభీపాకం నరకం గ్రీవబద్ధా హతా ఏవం పురుషాసో యమస్య

ఎవరు అభిచారిక హోమముచేసి మండే కట్టెలనుండి అగ్నిరూపుడైన పురుషుని నాపైకి విడిచినాడో వానిని మెడవట్టుకొని కుంభీపాక నరకమున పడవేయుము. అటులే ఆ ప్రయోగ పురుషుని కూడా యముని కడకు కొట్టి పంపుము.

46) కృష్ణవర్ణే మహద్రూపే బృహత్కర్ణే మహద్భయే
దేవి దేవి మహాదేవి మమ శత్రూన్ వినాశయ

పెద్ద చెవులతో నల్లని గొప్ప ఆకారముగలదానా! మహత్వవంతులకు కూడ భయము గొలుపుదానా! ఓ మహాదేవీ! నాశత్రువులను నాశనము చేయుము.

47) కుబేరం తేముఖం రౌద్రం నంది న్నానంద మావహ
జ్వరం మృత్యు భయం ఘోరం విషం నాశయ మే జ్వర!

ఓ జ్వర శక్తీ! నీముఖము వికృతము, భయంకరము అయినది. అట్టి నీవు ఆనంద స్వరూపిణివై నాకు ఆనందమును ప్రసాదింపుము. నా జ్వరమును, దానికి కారణమైన భయంకర విషమును, మరణభయమను, నాశనము చేయుము.

48) వర్షంతు తే విభావిరి దివో అభ్రస్య విద్యుతః
రోహంతు సర్వ బీజా న్యవ బ్రహ్మ ద్విషో జహి

ఓ రాత్రిదేవీ! నీ దివ్య విద్యుత్కాంతులు ఆకాశమునుండి వర్షించును గాక! సర్వబీజములు మొలకెత్తును గాక! మా తపస్సును రక్షింపుము. మా శత్రువులను సంహరింపుము.

49) ఋతం దేవి! మహాసూయే! కృత్యే! మాహేశ్వరప్రియే
శత్రోర్బలందహిత్వాశు పశుపుత్రాన్ వినాశయ

ఓ కృత్యాదేవీ! మహేశ్వరప్రియా! సత్యముగా నీవు గుణారోపణశక్తివి. నాశత్రువుల బలమును వేగముగా దహించి వారి పశువులను, పుత్రులను నాశనము చేయుము.

50) ఖట్‌ఫట్ జహి మహాకృత్యే! విధూమాగ్ని సమప్రభే!
హన శత్రూం స్త్రిశూలేన క్రుద్ధాస్యే! పిబ శోణితం

ఓ మహాకృత్యా! పొగలేని మంటవలె ప్రకాశించుదానా! నాశత్రువులను శూలముతో పొడిచి కొట్టిచంపుము. కోపించిన ముఖము గలదానా! వారి నెత్తురు త్రాగుము.

51) త్రిపాత్ భస్మ ప్రహరణః త్రిశిరా రక్తలోచనః
సమే ప్రీత స్సుఖం దద్యాత్ సర్వామయపతి ర్జ్వరః

మూడు పాదములు, మూడు తలలు, ఎర్రని కన్నులు కలవాడు, సర్వరోగములకు ప్రభువు-భస్మమను ఆయుధముతో కొట్టువాడు అయిన జ్వరపురుషుడు నాయందు ప్రేమగలవాడై సుఖము నిచ్చునుగాక!

52) జ్వరరాజాయ విద్మహే త్రిశిరస్కాయ ధీమహి
తన్న స్త్రిపాత్ ప్రచోదయాత్

మూడుపాదములుగల జ్వరరాజును తెలుసుకొని ఆమూడుతలలు గల స్వామిని ధ్యానించుచున్నాము. అతడు మమ్ము నడుపునుగాక!

53) గృధ్ర కర్ణి! విరూపాక్షి! లంబస్తని! మహోదరి!
హన శత్రూం స్త్రిశూలేన క్రుద్ధాస్యే పిబ శోణితం

గద్దచెవులు గలదానా! విరూపమైన అనగా బేసి సంఖ్యగల కన్నులుగలదానా! విరూపాక్షుడైన రుద్రుని శక్తీ! నా శత్రువులను త్రిశూలముతో పొడిచి చంపుము. కోపించిన ముఖముగలదానా! వారి నెత్తురు త్రాగుము.

54) లంబకర్ణే! లంబజిహ్వే! లంబస్తని! మహోదరి!
ఆదిశక్తే! మహాశక్తే! మమ శత్రు ర్వినశ్యతు

వ్రేలాడు చెవులు, నాలుక, కుచములు, పెద్దపొట్ట గలదానా! ఆదిశక్తీ! మహాశక్తీ! నాశత్రువు నశించునుగాక!

55) బ్రహ్మశక్తే! విష్ణుశక్తే! పరశక్తే! పరాపరే!
మహామాయే! మహాభీమే! మచ్ఛత్రూన్ దహ సంహర!

ఓ బ్రహ్మశక్తీ! విష్ణుశక్తీ! పరశక్తీ! పరాత్పరీ! మహామాయా! మిక్కిలి భయంకరమైన దానా! నాశత్రువులను తగల బెట్టుము, చంపుము.

56) భూతం గచ్ఛ మహామాయే! కృత్యే! మాహేశ్వర ప్రియే!
రిపోర్బలం నిహత్యాశు పశుపుత్రాంశ్చ నాశయ

ఓ మహామాయా! మహేశ్వర ప్రియురాలా! కృత్యా! పుట్టిన చోటుకే పొమ్ము! నాశత్రువుయొక్క బలమును వెంటనే దెబ్బతీసి వాని పశువులను పుత్రులను నాశనము చేయుము.

57) వజ్రీవ వృత్రం వినిహంతి కృత్యే యథా దవాగ్ని ర్దహతే తృణాని
తథా సపత్నాం త్వమరే జిఘాయ భూయశ్చ తాన్నాశయ నాశయాశు

ఓ కృత్యా! వజ్రధరుడైన ఇంద్రుడు వృత్రుని చంపినట్లుగా, కార్చిచ్చు గడ్డిని దహించి నట్లుగా నాజ్ఞాతులను శత్రువులను యుద్ధములో చంపి వెంటనే వారినందరిని నాశనము చేయుము.

58) యో మా నక్తం దివా సాయం ప్రాతశ్చాహ్నో నిపీయతే
అద్యా తమింద్ర వజ్రేణ ద్విషంతం శోచయామసి

ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము, రాత్రి ఎవడు నన్ను గ్రసించ వలెనని పూనినాడో ఇప్పడే ఆ శత్రువును ఇంద్రుని వజ్రముతో దహించెదను.

59) యో మాం ద్వేష్టి జాతవేదో యంచాహం ద్వేష్టి యశ్చమాం
సర్వాం స్తానగ్నే సందహ యాం శ్చాహం ద్వేష్టి యేచ మాం

ఎవడు నన్ను ద్వేషించు చున్నాడో, నేను ఎవరిని ద్వేషించు చున్నానో ఓజాత వేదా! అగ్నీ! వారందరినీ బాగుగా దహింపుము.

60) ఓం శత్రుకార్య హానికరి! మమకార్య సిద్ధికరి!
శత్రూణాం ఉద్యోగ విఘ్నకరి! మమసర్వోద్యోగ వశ్యకరి!
ప్రత్యంగిరే! స్వాహా

నావైరుల పనులకు హానిచేయుదానా! నాపనులను సిద్ధింప జేయుదానా! శత్రువుల ప్రయత్నములకు విఘ్నము కల్గించుదానా! నాకు సర్వోద్యోగములను వశము చేయుదానా! ప్రత్యంగిరా! నిన్ను ఆవాహన చేస్తున్నాను.

ఇత్యాధర్వణే పిప్పలాదశాఖీయం సపరిశిష్టం
ప్రత్యంగిరా సూక్తం సమాప్తం.



# ప్రత్యంగిరాదేవి అష్టోత్తర శతనామావళి

1. ఓం ప్రత్యంగిరాయై నమః
2. ఓం ఓంకార రూపిణ్యై నమః
3. ఓం క్షం హ్రాం బీజప్రేరితాయై నమః
4. ఓం విశ్వరూపాయై నమః
5. ఓం విరూపాక్ష ప్రియాయై నమః
6. ఓం ఋఙ్మంత్ర పారాయణ ప్రీతాయై నమః
7. ఓం కపాల మాలాలంకృతాయై నమః
8. ఓం నాగేంద్ర భూషణాయై నమః
9. ఓం నాగ యజ్ఞోపవీత ధారిణ్యై నమః
10. ఓం కుంచిత కేశిన్యై నమః
11. ఓం కపాల ఖట్వాంగ ధారిణ్యై నమః
12. ఓం శూలిన్యై నమః
13. ఓం రక్త నేత్ర జ్వాలిన్యై నమః
14. ఓం చతుర్భుజాయై నమః
15. ఓం డమరుక ధారిణ్యై నమః
16. ఓం జ్వాలా కరాళ వదనాయై నమః
17. ఓం జ్వాలా జిహ్వాయై నమః
18. ఓం కరాళ దంష్ట్రాయై నమః
19. ఓం ఆభిచారిక హోమాగ్ని సముత్థితాయై నమః
20. ఓం సింహ ముఖాయై నమః
21. ఓం మహిషాసుర మర్దిన్యై నమః

22. ఓం ధూమ్రలోచనాయై నమః

23. ఓం కృష్ణాంగాయై నమః

24. ఓం ప్రేతవాహనాయై నమః

25. ఓం ప్రేతాసనాయై నమః

26. ఓం ప్రేత భోజిన్యై నమః

27. ఓం రక్త ప్రియాయై నమః

28. ఓం శాక మాంస ప్రియాయై నమః

29. ఓం అష్ట బైరవ సేవితాయై నమః

30. ఓం డాకినీ పరిసేవితాయై నమః

31. ఓం మధుపాన ప్రియాయై నమః

32. ఓం బలి ప్రియాయై నమః

33. ఓం సింహ వాహనాయై నమః

34. ఓం సింహ గర్జిన్యై నమః

35. ఓం పరమంత్ర విదారిణ్యై నమః

36. ఓం పరయంత్ర వినాశిన్యై నమః

37. ఓం పరకృత్యా విధ్వంసిన్యై నమః

38. ఓం గుహ్యావిద్యాయై నమః

39. ఓం సిద్ధ విద్యాయై నమః

40. ఓం యోని రూపిణ్యై నమః

41. ఓం నవయోని చక్రాత్మికాయై నమః

42. ఓం వీర రూపాయై నమః

43. ఓం దుర్గా రూపాయై నమః

44. ఓం మహా భీషణాయై నమః

45. ఓం ఘోర రూపిణ్యై నమః
46. ఓం మహా క్రూరాయై నమః
47. ఓం హిమాచల నివాసిన్యై నమః
48. ఓం వరాభయ ప్రదాయై నమః
49. ఓం విషు రూపాయై నమః
50. ఓం శత్రుభయంకర్యై నమః
51. ఓం విద్యుద్ఘాతాయై నమః
52. ఓం శత్రుమూర్ధ స్ఫోటనాయై నమః
53. ఓం విధూమాగ్ని సమప్రభాయై నమః
54. ఓం మహా మాయాయై నమః
55. ఓం మాహేశ్వర ప్రియాయై నమః
56. ఓం శత్రుకార్య హానికర్త్యై నమః
57. ఓం మమ కార్య సిద్ధి కర్త్యై నమః
58. ఓం శత్రూణాం ఉద్యోగ విఘ్న కర్త్యై నమః
59. ఓం మమ సర్వోద్యోగ వశ్య కర్త్యై నమః
60. ఓం శత్రు పశుపుత్ర వినాశిన్యై నమః
61. ఓం త్రినేత్రాయై నమః
62. ఓం సురాసుర నిషేవితాయై నమః
63. ఓం తీవ్రసాధక పూజితాయై నమః
64. ఓం నవగ్రహ శాసిన్యై నమః
65. ఓం ఆశ్రిత కల్పవృక్షాయై నమః
66. ఓం భక్త ప్రసన్న రూపిణ్యై నమః
67. ఓం అనంత కళ్యాణ గుణాభిరామాయై నమః

68. ఓం కామరూపిణ్యై నమః

69. ఓం క్రోధ రూపిణ్యై నమః

70. ఓం మోహరూపిణ్యై నమః

71. ఓం మదరూపిణ్యై నమః

72. ఓం ఉగ్రాయై నమః

73. ఓం నారసింహ్యై నమః

74. ఓం మృత్యు మృత్యు స్వరూపిణ్యై నమః

75. ఓం అణిమాది సిద్ధి ప్రదాయై నమః

76. ఓం అంతశ్శత్రు విదారిణ్యై నమః

77. ఓం సకల దురిత వినాశిన్యై నమః

78. ఓం సర్వోపద్రవ నివారిణ్యై నమః

79. ఓం దుర్జన కాళరాత్ర్యై నమః

80. ఓం మహాప్రాజ్ఞాయై నమః

81. ఓం మహాబలాయై నమః

82. ఓం కాళీరూపిణ్యై నమః

83. ఓం వజ్రాంగాయై నమః

84. ఓం దుష్ట ప్రయోగ నివారిణ్యై నమః

85. ఓం సర్వ శాపవిమోచన్యై నమః

86. ఓం నిగ్రహానుగ్రహ క్రియానిపుణాయై నమః

87. ఓం ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తి రూపిణ్యై నమః

88. ఓం బ్రహ్మ విష్ణు శివాత్మికాయై నమః

89. ఓం హిరణ్య సటాచ్ఛటాయై నమః

90. ఓం ఇంద్రాది దిక్పాలక సేవితాయై నమః

91. ఓం పరప్రయోగ ప్రత్యక్ ప్రచోదిన్యై నమః

92. ఓం ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తి రూపిణ్యై నమః

93. ఓం ఖడ్గమాలా రూపిణ్యై నమః

94. ఓం నృసింహ సాలగ్రామ నివాసిన్యై నమః

95. ఓం భక్త శత్రు భక్షిణ్యై నమః

96. ఓం బ్రహ్మాస్త్ర స్వరూపాయై నమః

97. ఓం సహస్రార శక్త్యై నమః

98. ఓం సిద్ధేశ్వర్యై నమః

99. ఓం యోగీశ్వర్యై నమః

100. ఓం ఆత్మరక్షణ శక్తిదాయిన్యై నమః

101. ఓం సర్వ విఘ్న వినాశిన్యై నమః

102. ఓం సర్వాంతక నివారిణ్యై నమః

103. ఓం సర్వదుష్ట ప్రదుష్ట శిరశ్ఛేదిన్యై నమః

104. ఓం అధర్వణ వేద భాసితయై నమః

105. ఓం శ్మశాన వాసిన్యై నమః

106. ఓం భూత భేతాళ సేవితాయై నమః

107. ఓం సిద్ధ మండల పూజితాయై నమః

108. ఓం ప్రత్యంగిరా భద్రకాళీ దేవతాయై నమః

❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁

## ప్రత్యంగిరా మంత్రములు

అస్యశ్రీ ప్రత్యంగిరా మంత్రస్య బ్రహ్మ ఋషిః అనుష్టుప్ ఛందః, దేవీ ప్రత్యంగిరా దేవతా, ఓం బీజం, హ్రీం శక్తిః మమ అఖిలా వాప్తయే జపే వినియోగః

ధ్యానం

ఆశాంబరా ముక్త కచా ఘనచ్ఛవిః
ధ్యేయా సచర్మాసికరాహి భూషణా
దంష్ట్రోగ్ర వక్త్రా గ్రసితా హితాన్వయా
ప్రత్యంగిరా శంకర తేజసేరితా

మంత్రములు

1) ఓం హ్రీం యాం కల్పయంతినోరయః
క్రూరాం కృత్యాం వధూమివ
తాం బ్రహ్మణాపనిర్ణుద్మః
ప్రత్యక్కర్తార మృచ్ఛతు హ్రీం ఓం

ప్రత్యంగిరా ఋక్కులలోని మంత్రములను వాని అర్థమును బట్టి ఈ విధముగానే జపించి ఉపయోగించు కోవచ్చును.

2) క్షం హ్రాం హ్రీం భక్ష జ్వాలాజిహ్వే కరాళదంష్ట్రే
ప్రత్యంగిరే క్షం హ్రాం హ్రీం హుం ఫట్ స్వాహా.

3) క్షం హ్రాం క్రీం భక్ష జ్వాలాజిహ్వే కరాళదంష్ట్రే
ప్రత్యంగిరే భద్రకాళి క్షం హ్రాం క్రీం హుంఫట్ స్వాహా.

4) ఓం హ్రీం నమః కృష్ణ వాససే శత సహస్ర హింసిని సహస్ర వదనే మహాబలే అపరాజితే ప్రత్యంగిరే పరసైన్య పరకర్మ విధ్వంసిని పరమంత్రోత్సాదిని సర్వభూతదమని సర్వ దేవాన్ బంధ బంధ సర్వ విద్యా శ్ఛిందిఛింది క్షోభయ క్షోభయ పరయంత్రాణి స్ఫోటయ స్ఫోటయ సర్వశృంఖలా స్త్రోటయత్రోటయ జ్వల జ్వాలా జిహ్వే కరాళవదనే ప్రత్యంగిరే హ్రీం నమః

## ధ్యానం

సింహారూఢాతికృష్ణా త్రిభువన భయకృత్ రూపముగ్రంవహంతీ
జ్వాలా వక్త్రావసానా నవవసనయుగం నీలమణ్యాభకాంతిః
శూలం ఖడ్గం వహంతీ నిజకర యుగళే భక్తరక్షైకదక్షా
సేయం ప్రత్యంగిరా సంక్షపయతు రిపుభిః నిర్మితంవోభిచారం.

5) ఓం ఆం హ్రీం క్రోం కృష్ణవాససే శతసహస్రసింహ
వదనే మహాభైరవి జ్వలజ్వలజ్వాలాజిహ్వే
కరాళవదనే ప్రత్యంగిరే హ్రీంక్ష్రాం
ఓం నమోనారాయణాయ ఓం ఘృణిస్సూర్య
ఆదిత్యోం సహస్రార హుంఫట్

6) ప్రత్యంగిరా గాయత్రి -
కరాళవదనాయవిద్మహే జ్వాలాజిహ్వాయ
ధీమహి తన్నః ప్రత్యంగిరాప్రచోదయాత్

## ప్రత్యంగిరా యంత్రము

కవచశ్లోకములలో యంత్రస్వరూపము చెప్పబడినది. బిందువు, త్రికోణము, దానిపై పంచకోణము, దానిపై అష్టదళము, ఆపై షోడశదళము, భూపురము లిఖించి - దానిలో దశాంగములు - అనగా మంత్రబీజము, శక్తిబీజము, నేత్రశ్రోతృబీజములు, దిక్పాలకబీజములు, పంచభూతబీజములు, మంత్రగాయత్రి, యంత్రగాయత్రి - ప్రధానమంత్రము - ఇవన్నీ వ్రాయవలెను. అప్పుడు ప్రాణప్రతిష్ఠచేసి - నిత్యపూజ చేయవలెను.

7. ప్రత్యంగిరా పూజా యంత్రము




బిందువు, త్రికోణము, దానిపై రెండు ఎదురెదురు త్రికోణములు, ఎదురెదురు చతురస్రములు రెండు, అష్టదళము, దానిపై మరియొక అష్టదళము, భూపురము. (ఇది మరియొక యంత్రము)

## దిక్పాలక బలిదాన ప్రకారము

తూర్పున

ఓం యోమే పూర్వగతః పాప్మా
పాపకేనేహ కర్మణా
ఇంద్రస్తం దేవరాజో
భంజయతు, అంజయతు, మోహయతు, నాశయతు
మారయతు బలింతస్మై ప్రయచ్ఛతు కృతంమమ
శివం మమశాంతిః స్వస్త్యయనంచాస్తు

ఈ మంత్రములో పూర్వ అని ఉన్నచోట ఇతర దిక్కు యొక్క పేరు అనగా ఆగ్నేయ, దక్షిణ మొ॥ ఉంచి, ఇంద్రస్థానములో అగ్ని, యమ మొ॥ దిక్పాలకుల పేర్లు, అటులే దేవరాజ - అన్న స్థానములో తేజోరాజ, ప్రేతరాజ మొ॥ పేర్లుంచి మంత్రము చెప్పి బలి సమర్పించవలెను.

జపానంతరము దశాంశము హోమము చేయవలెను.

**హోమ ద్రవ్యములు**

| | | |
|---|---|---|
| 1) ఆవాలు - నెయ్యి | 6) వేప | 11) శొంఠి |
| 2) హవిస్సు | 7) ఆవాలు | 12) పిప్పళ్ళు |
| 3) ఉత్తరేణు సమిధలు | 8) వెల్లుల్లి | 13) మిరియాలు |
| 4) మిరపకాయలు | 9) ఊడుగు | |
| 5) విభీతకము (తాని) | 10) మునగ | |

## ప్రత్యంగిరా స్తవరాజః

అస్య శ్రీ ప్రత్యంగిరా ఉగ్రకృత్యా దేవీ మహామన్త్రస్య ప్రత్యంగిరాఋషిః - అనుష్టుప్ఛందః-శ్రీశక్తిః ప్రత్యంగిరా ఉగ్రకృత్యా దేవీ దేవతా-హ్రీం బీజం-క్రోంశక్తిః-శ్రీం కీలకం- మమ సర్వశత్రు సంహరణార్థే పరమన్త్ర పరయన్త్ర పరతంత్ర పరకర్మ పరవిద్యాద్యాభిచారిక విధానార్థే మమ సహకుటుంబస్య సపుత్రకస్య సబాంధవస్య సపరివారస్య క్షేమ స్థైర్యాయురారోగ్యైశ్వరాభివృద్ధ్యర్థే శ్రీ ప్రత్యంగిరా మహాదేవీ ప్రసాద సిద్ధ్యర్థే ప్రత్యంగిరా మన్త్ర జపే వినియోగః

ఓం అం హ్రాం హ్రీం సహస్ర వదనాయై - ఆం అంగుష్ఠాభ్యాం నమః - ఓం ఇం హ్రీం హ్రీం అష్టాదశ భుజాయై- ఈంతర్జనీభ్యాం నమః- ఓం ఉం హ్రూం హ్రీం త్రిణేత్రాయై- ఊం మధ్య-ఓం ఏం హ్రైం హ్రీం రక్తమాల్యాంబరధరాయై-ఐం అనా-ఓం ఓం హ్రౌం హ్రీం సర్వాభరణ భూషితాయై-ఔం కని-ఓం అంహ్రః హ్రీం మహాభయ నివారణాయై-అః కర-ఏవం హృదయాదిన్యాసః, భూర్భు ....... దిగ్బంధః.

## ధ్యానమ్

సహస్రవదనాం దేవీం శతబాహూం త్రిలోచనామ్,
రక్తమాల్యాంబరధరాం సర్వాభరణభూషితామ్.
శక్తిం ప్రత్యంగిరాం ధ్యాయేత్సర్వ కామార్థ సిద్ధయే,
నమః ప్రత్యంగిరాం దేవీం ప్రతికూల నివారిణీమ్.
మంత్రసిద్ధిం చ తాం దేవీం చింతయామి హృదంబుజే,
ప్రత్యంగిరాం శాపహరాం భూతప్రేత వినాశినీమ్.
చింతయే దుగ్రకృత్యాం తాం పరమైశ్వర్య దాయినీమ్.

### మనుః

ఓం హ్రీం ఈం గ్లౌ శ్రీం సౌం మైం హుం నమః కృష్ణ వాససే శతసహస్ర సింహవదనే అష్టాదశ భుజే మహాబలే శత పరాక్రమ పూజితే అజితే అపరాజితే దేవి ప్రత్యంగిరే పరసైన్య పర కర్మ విధ్వంసిని పరమంత్రభేదిని పరయన్త్ర పరతన్త్రోచ్చాటని పరవిద్యాగ్రా సకరే సర్వ భూతదమని క్షం గ్లాం సౌం ఈం హ్రీం క్రీం క్రాం ఏహ్యేహి ప్రత్యంగిరే చిదచిద్రూపే సర్వోపద్ర వేభ్యస్సర్వ గ్రహదోషేభ్య స్సర్వ రోగేభ్యః ప్రత్యంగిరే మాం రక్ష రక్ష హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః క్షాం క్షీం క్షూం క్షైం క్షౌం క్షః గ్లాం గ్లీం గ్లూం గ్లైం గ్లౌం గ్లః ప్రత్యంగిరే పరబ్రహ్మ మహిషి పరమకారుణికే ఏహి మమ శరీరే ఆవేశయ ఆవేశయ మమ హృదయే స్ఫుర స్ఫుర మమాంసే ప్రస్ఫుర సర్వదుష్టానాం వాచం ముఖం పదం స్తంభయ స్తంభయ జిహ్వాం కీలయ కీలయ బుద్ధిం వినాశయ వినాశయ ప్రత్యంగిరే మహాకుండలిని చంద్రకళావతంసిని బేతాళవాహనే ప్రత్యంగిరే కపాలమాలాధారిణి త్రిశూల వజ్రాంకుశ బాణ బాణాసన పాణి పాత్ర పూరితం మమ శత్రు శోణితం పిబ పిబ మమ శత్రు మాంసం ఖాదయ ఖాదయ మమ శత్రూన్తాడయ తాడయ మమ వైరిజనాన్దహ దహ మమ విద్వేషకారిణ శ్శీఘ్రమేవ భక్షయ భక్షయ - శ్రీ ప్రత్యంగిరే భక్త కారుణికే శీఘ్రమేవ దయాం కురు కురు సద్యో జ్వరజాద్య

ముక్తిం కురు కురు బేతాళ బ్రహ్మ రాక్షసాదీన్ జహి జహి మమ శత్రూన్ తాడయ తాడయ ప్రారబ్ధసంచిత క్రియమాణాన్ దహ దహ దూషకాన్ సద్యో దీర్ఘరోగయుక్తాన్ కురు కురు ప్రత్యంగిరే ప్రాణశక్తిమయే మమ వైరిజన ప్రాణాన్హన హన మర్దయ మర్దయ నాశయ నాశయ ఓం శ్రీం హ్రీం క్రీం సౌం గ్లౌం - ప్రత్యంగిరే మహామాయే దేవి దేవి మమ వాంఛితం కురు కురు కురు మాం రక్ష రక్ష ప్రత్యంగిరే స్వాహా.

మన్త్ర యన్త్ర సుఖాసీనం చన్ద్ర చూడం మహేశ్వరమ్.
సహసాగత్య చరణే పార్వతీ పరిపృచ్ఛతి,

*ఈశ్వర ఉవాచ:*

ధారణీం పరమాం విద్యాం ప్రత్యంగిరాం మహోత్తమామ్.
యో జానాతి స్వహస్తేన సర్వం సాధ్యం హి జిహ్వయా,
అమృతం పిబతే తస్య మృత్యుర్నాస్తి కదాచన.
త్రిపురాం చ సమాయాతాం సేమాం విద్యాం చ బిభ్రతీమ్,
నిర్జితాశ్చా మరాస్సర్వే దేవీ విద్యాభిమానినీ.
గోళకం సమ్ప్రవక్ష్యామి భైషజ్యమివ ధారణాత్,
త్రివృతం ధారయేన్మంత్రం ప్రత్యంగిరస్సుభాషితమ్.
హరిచందన మిశ్రేణ రోచనైః కుంకుమేన చ,
లిఖిత్వా భూర్జపత్రేణ ధారణీయం సదా నృపైః.
పుష్పధూపవిచిత్రైశ్చ భక్ష్యభోజ్యై ర్నివేదనమ్,
పూజయిత్వా యథాన్యాయం సప్తకుంభేన వైష్ణవీమ్.
య ఇమాం ధారయేద్విద్యాం లిఖిత్వా రిపునాశినీమ్,
విలయం యాంతి రిపవః ప్రత్యంగిరా సుధారణాత్.

## అథో మంత్రపదాని భవంతి

ఓం నమః సూర్య సహస్రే క్షణాయ ఓం అనాదిరూపాయ ఓం పురుహూతాయ ఓం మహేశ్వరాయ ఓం జగచ్ఛాంతికారిణే ఓం శాన్తాయ ఓం మహాఘోరాయ ఓం అతిఘోరాయ ఓం ప్రభవ ప్రభవ ఓం దర్శయ దర్శయ ఓం మర్దయ మర్దయ ఓం హి హి హి ఓం కిలి కిలి కిలి ఓం జ్వల జ్వల జ్వల ఓం గ్రస గ్రస గ్రస ఓం పిబ పిబ పిబ ఓం నాశయ నాశయ నాశయ ఓం జనయ3 ఓం విదారయ3 దేవి దేవి మాం రక్ష రక్ష రక్ష హ్రీం దేవి దేవి పిశాచ కిన్నర కింపురుష ఉరగ విద్యాధర రుద్ర గరుడ గంధర్వ యక్ష రాక్షసలోక పాలాన్ స్తంభయ స్తంభయ స్తంభయ యే చ శ త్రవశ్చాభిచారకర్తార స్తేషాం శత్రూణాం మంత్ర యంత్ర తంత్రాణి చూర్ణయ3 ఘాతయ3 విశ్వమూర్తిం మహామూర్తిం జయ జయ జయ మమ శత్రూణాం ముఖం స్తంభయ మమ శత్రూణాం పాదం స్తంభయ స్తంభయ స్తంభయ3 మమ శత్రూణాం గుహ్యం స్తంభయ స్తంభయ స్తంభయ మమ శత్రూణాం జిహ్వాం స్తంభయ3 మమ శత్రూణాం స్థానం కీలయ కీలయ కీలయ మమ శత్రూణాం గ్రామం కీలయ3 మమ శత్రూనాం దేశం కీలయ3 యే చ పాతకస్య పరివారకాస్తేషాం శాన్తిం కురు కురు స్వాహా. ఓం నమో భగవతి ఉచ్ఛిష్ట చాండాలి త్రిశూల వజ్రాంకుశ ధారిణి నరరుధిర మాంసభక్షణి కపాల ఖట్వాంగ ధారిణి మమ శత్రూన్ దహ దహ దహ గ్రస గ్రస పిబ పిబ ఖాహి ఖాహి నాశయ నాశయ హుం ఫట్ స్వాహా.

ఓం బ్రహ్మాణి మమ నేత్రే రక్ష రక్ష స్వాహా

ఓం కౌమారి మమ వక్షస్థలం రక్ష రక్ష స్వాహా

ఓం వారాహి మమ హృదయం రక్ష రక్ష స్వాహా

ఓం ఇంద్రాణి మమ నాభిం రక్ష రక్ష స్వాహా

ఓం చండికే మమ గుహ్యం రక్ష రక్ష స్వాహా

ఓం మేఘవాహనే మమ ఊరుం రక్ష రక్ష స్వాహా

ఓం చాముండి మమ జంఘే రక్ష రక్ష స్వాహా

ఓం వసుంధరే మమ పాదౌ రక్ష రక్ష స్వాహా

ఓం ఝః ఓం ఝః ఓం ఝః ఓం ఝః ఓం ధః ఓం ధః

ఓం మం అంగుష్ఠా, ఓం యం త, ఓం రం మ, ఓం హుం అనా, ఓం ఐం కని,

ఓం సౌః కరతల- ఏవం హృదయాదిన్యాసః- భూర్భువస్సువరోమితి దిగ్బంధః

## ధ్యానమ్

స్తంభినీం మోహినీం చైవోచ్చాటనీం క్షోభిణీం తథా,

జృంభిణీం ద్రావిణీం రౌద్రీం తథా సంగ్రహిణీం శుభామ్.

(శక్తయః కర్మ యోగేన శత్రుపక్షే నియోజయేత్)

ఓం ఝః3 ఓంధః3 స్త్రైం-౨ ఓం స్తంభయ-౨క్షోభయ హుం ఫట్ స్వాహా.

ఓం జృంభిణి ష్వేగ్నిం ష్వేగ్నిం మమ శత్రూన్ జృంభయ జృంభయ హుం

ఫట్ స్వాహా.

ఓం దాక్షాయణిష్వేగ్నిం ష్వేగ్నిం మమ శత్రూన్ భ్రామయ భ్రామయ హుం

ఫట్ స్వాహా.

ఓం రాత్రి రాత్రి ష్వేగ్నిం మమ శత్రూన్ ఉచ్చాటయోచ్చాటయోచ్చాటయ

హుం ఫట్ స్వాహా.

ఓం సంహారయక్షిణి ష్వేగ్నిం మమ శత్రూన్ సంహారయ సంహారయ హుం

ఫట్ స్వాహా.

ఓం సంతాపయని ష్వేగ్నిం ష్వేగ్నిం శత్రూన్ సంతాపయ సంతాపయ

సంతాపయ హుం ఫట్ స్వాహా.

ఓం సర్వసంహారకారిణి మహా ప్రత్యంగిరే సర్వశాస్త్రోన్మూలని స్వాహా.

ఇతి శ్రీ రుద్రయామళే శ్రీ శూలపాణి విరచిత సర్వశక్తి

శ్రీ ప్రత్యంగిరా స్తవరాజః

## ప్రత్యంగిరా కవచమ్

హరిః ఓం- దేవ దేవ మహాదేవ సర్వజ్ఞ కరుణానిధే,
ప్రత్యంగిరాయాః కవచం సర్వరక్షాకరం నృణామ్. ౧
జగన్మాంగళికం నామ ప్రసిద్ధం భువనత్రయే,
సర్వరక్షాకరం నృణాం రహస్యమపి తద్వద. ౨

**శ్రీ శివ ఉవాచ:**

శృణు కల్యాణి వక్ష్యామి కవచం శత్రునిగ్రహమ్,
పరప్రేషితకర్మాణి తత్ర శల్యాదిభక్షణమ్. ౩
మహాభిచారశమనం సర్వకార్యప్రదం నృణామ్,
పరసేనాసమూహేచ రాజ్ఞాముద్దిశ్య మండలాత్. ౪
జప మాత్రేణ దేవేశి సమ్యగుచ్చాటనం భవేత్,
సర్వతన్త్ర ప్రశమనం కారాగృహ విమోచనమ్. ౫
క్షయాపస్మారకుష్ఠాదితాపజ్వర నివారణమ్,
పుత్రదం ధనదం శ్రీదం పుణ్యదం పాపనాశనమ్. ౬
వశ్యప్రదం మహారాజ్ఞాం విశేషాచ్ఛత్రునాశనమ్,
సర్వరక్షాపరం శూన్య గ్రహపీడా వినాశనమ్. ౭
బిందుత్రికోణం త్వథ పంచకోణం దళాష్టకం షోడశపత్ర వృత్తమ్,
మహీ పురేణావృతమంబుజాక్షి లిఖేన్మనోరంజన మగ్రతోపి . ౮
యామ్యాం పురీం యాతిరిపుః ప్రయోగాత్,
స్వతంనివృత్త్యా రఘునాథ బీజాత్. (?) ౯
మహీపురాత్పూర్వమేవ ద్వాత్రింశ త్పత్ర మాలిఖేత్,
అంతరే భూపురం లేఖ్యం కోణాగ్రే క్షాం సమాలిఖేత్. ౧౦
భద్రకాళీమనుం లేఖ్యం మంత్రం ప్రత్యంగిరాత్మకమ్,
భద్రకాళ్యుక్తమార్గేణ పూజ్యాం ప్రత్యంగిరాం శివామ్. ౧౧

రక్తపుష్పైస్సమభ్యర్చ్య కవచం జప మాచరేత్,
సకృత్పఠనమాత్రేణ సర్వశత్రూన్ వినాశయేత్. ౧౨
శత్రవశ్చ పలాయం తే తస్య దర్శనమాత్రతః,
మాసమాత్రం జపేద్దేవి సర్వశత్రూన్ వినాశయేత్. ౧౩
యాం కల్పయంతీ ప్రదిశం రక్షేత్కాళీ త్వధర్వణీ,
రక్షేత్కరాళాత్వాగ్నేయ్యాం సదా మాం సింహవాహనీ. ౧౪
యామ్యాం దిశం సదా రక్షేత్కక్షజ్వాలా స్వరూపిణీ,
నైరృత్యాం రక్షతు సదా మాస్మానృచ్ఛే అనాగసః. ౧౫
వారుణ్యాం రక్షతు మమ ప్రజాం చ పురుషార్దినీ,
వాయవ్యాం రక్షతు సదా యాతుధాన్యో మమాఖిలాః. ౧౬
దంష్ట్రాకరాళవదనా కౌబేర్యాం బడబానలా,
ఈశాన్యాం మే సదా రక్షేద్వీరాంశ్చాన్యాన్నిబర్హయ. ౧౭
ఉగ్రా రక్షేదధోభాగే మాయామన్త్ర స్వరూపిణీ,
ఊర్ధ్వం కపాలినీ రక్షేత్ క్షం హ్రీం హుం ఫట్ స్వరూపిణీ. ౧౮
అధో మే విదిశం రక్షేత్కురుకుల్లా కపాలినీ,
ప్రవిచిత్తా సదా రక్షేత్ దివారాత్రం విరోధినీ. ౧౯
కురుకుల్లా తు మే పుత్రాన్ బాంధవా నుగ్రరూపిణీ,
ప్రభాదీప్త గ్రహో రక్షేత్ మాతాపుత్రాంత్సుమాతృజాన్. ౨౦
స్వభృత్యాన్ మే సదా రక్షేత్పాయాత్ సా మే పశూన్సదా,
అజితా మే సదా రక్షేదపరాజిత కామదా. ౨౧
కేశం రక్షేత్సహస్రాణీ ద్వినేత్రా కాసరాత్రికా,
ఫాలం పాతు మహాక్రూరా వేగ కేశీ శిరోరుహాన్. ౨౨
భ్రువౌ మే క్రూరవదనా పాయాచ్చండీ ప్రచండికా,
శ్రోత్రయోర్యుగళం పాతు తదా మే శంఖకుండలా. ౨౩
ప్రేత చిత్యాసనా దేవీ పాయాన్నేత్రయుగం మమ,
మమ నాసాయుగద్వంద్వం బ్రహ్మరోచిష్ణు మిత్రహా. ౨౪

కపోలౌ మే సదా పాతు భృగవశ్చాప సేధిరే,
ఊర్ధ్వోష్ఠం తు సదా పాతు రథస్యేవ విభుర్ధియా. ౨౫
అధరోష్ఠం సదా పాతు అజ్ఞాతస్తే వశో జనః,
దంతపంక్తిద్వయం పాతు బ్రహ్మరూపీ కరాళినీ. ౨౬
వాచం వాగీశ్వరీ రక్షే ద్రసనాం జననీ మమ,
చుబుకం పాతు మేంద్రాణీ తనూంబుచ్ఛస్వ హేళికా. ౨౭
కర్ణస్థానం మమ సదా రక్షతాం కంబుకంధరా,
కంఠధ్వనిం సదా పాతు నాదబ్రహ్మమయీ మమ. ౨౮
జఠరం మేంగిరః పుత్రీ మే వక్షః పాతు కాంచనీ,
పాతు మే భుజయోర్మూలం జాత వేదస్వరూపిణీ. ౨౯
దక్షిణం మే భుజం పాతు సతతం కాళరాత్రికా,
వామం భుజం వామ కేశీ పరాయంతీ పరావతీ. ౩౦
పాతు మే కూర్పరద్వంద్వం మనస్తత్వాభిధా సతీ,
వాచం వాగీశ్వరీ రక్షేద్రసనాం జననీ మమ. ౩౧
వజ్రేశ్వరీ సదా పాతు ప్రకోష్ఠయుగళం మమ,
మణిద్వయం సదా పాతు ధూమ్రా శత్రుజిఘాంసయా. ౩౨
పాయాత్కరతలద్వంద్వం కదంబవనవాసినీ,
వామపాణ్యంగులీ పాతు హినస్తి పరశాసనమ్. ౩౩
సవ్య పాణ్యంగులీ పాతు యదవైషి చతుష్పదీ,
నాభిం నిత్యా సదా పాతు జ్వాలాభైరవరూపిణీ. ౩౪
పంచాస్యపీఠనిలయా పాతు మే పార్శ్వ యోర్యుగమ్,
పృష్ఠం ప్రజ్ఞేశ్వరీ పాతు కటిం స్వస్థనితంబినీ. ౩౫
గుహ్యమానందరూపావ్యాదండం బ్రహ్మాండనాయకీ,
పాయాన్మమ గుదస్థాన మిందుమౌళిమన శ్శుభా. ౩౬
బీజం మమ సదా పాతు దుర్గా దుర్గార్తి హారిణీ,
ఊరూ మే పాతు క్షాంతాత్మా త్వం ప్రత్యస్య స్వమృత్యవే. ౩౭

వాణీ దుర్గా సదా పాతు జానునీ వనవాసినీ,
జంఘాకాండద్వయం పాతు యశ్చజామిశపాతినః. ౩౮
గుల్ఫయోర్యుగళం పాతు యో స్మాన్ద్వేష్టి వధస్వ తమ్,
పదద్వంద్వం సదావ్యాన్మే పదావిస్ఫార్య తచ్ఛిరః. ౩౯
అభిప్రేహి సహస్రాక్ష పాదయోర్యుగళం మమ,
పాయాన్మమ పదద్వంద్వం దహన్నగ్నిరివ హ్రదమ్. ౪౦
సర్వాంగం పాతు పానీయాత్సర్వ ప్రకృతిరూపిణీ,
మంత్రం ప్రత్యంగిరాకృత్యా కృత్యా చ్చాసుహృదో సుహా. ౪౧
పరాభిచారకృత్యాత్మ సమిద్ధం జాత వేదసమ్,
పరప్రేషితశల్యాత్మే తమితో నాశయామసి. ౪౨
వృక్షాది ప్రతిరూపాత్మ శివం దక్షిణతస్కృధి,
అభయం సతతం పశ్చాద్భద్రముత్తరతో గృహే. ౪౩
భూత ప్రేతపిశాచాద్యాన్ ప్రేషితాన్ జహి మాం ప్రతి,
భూత ప్రేతపిశాచాదీ పరతన్త్ర వినాశినీ. ౪౪
పరాభిచారశమనీ ధారణాత్సర్వసిద్ధిదామ్,
భూర్జపత్రే స్వర్ణ పత్రే లిఖిత్వా ధారయేద్యది. ౪౫
సర్వసిద్ధిమవాప్నోతి సర్వత్ర విజయీ భవేత్,
ఏకవృత్తిం జపేద్దేవి సర్వఋుగ్జపదా భవేత్. ౪౬
భద్రకాళీ ప్రసన్నా భూదభీష్ట ఫలదా భవేత్,
బందీగృహే సప్తరాత్రం చోరద్రవ్యే ష్ట రాత్రకమ్. ౪౭
మహాజ్వరే సప్తరాత్రం ఉచ్చాటే మాసమాత్రకమ్,
మహావ్యాధి నివృత్తిస్స్యాన్మండలం జపమాచరేత్. ౪౮
పుత్రకార్యే మాసమాత్రం మహాశత్రుత్వమండలాత్,
యుద్ధకార్యే మండలం స్యాద్ధార్యం సర్వేషు కర్మసు. ౪౯
అస్మిన్యజ్ఞే సమావాహ్య రక్తపుష్పైస్సమర్చయేత్,
నత్వా న కర్తు మర్హాసి ఇషురూపే గృహాత్సదా. ౫౦

శాస్త్రాలయే చతుష్పథే స్వగృహే గేహళీస్థలే,
నిఖనేద్యం త్రిశల్యాది తదర్ధం ప్రాపయాశుమే. ౫౧
మాసోచ్ఛిష్టశ్చ ద్విపదమేతత్కించి చ్చతుష్పదమ్,
మాజ్ఞాతి రనుజానస్యాన్మాసావేశి ప్రవేశినః. ౫౨
బలే స్వప్నస్థలే రక్షేద్యో మే పాపం చికీర్షతి,
ఆపాదమస్తకం రక్షేత్తమేవ ప్రతిధావతు. ౫౩
ప్రతిసర ప్రతిధావ కుమారీవ పితుర్గృహం
మూర్ధాన మేషాం స్ఫోటయ వధామ్యేషాం కులే జహి. ౫౪
యే మే మనసా వాచా యశ్చ పాపం చికీర్షతి,
తత్సర్వం రక్షతాం దేవీ జహి శత్రూంత్సదా మమ. ౫౫
ఖట్ఫడ్జహి మహాకృత్యే విధూమాగ్ని సమప్రభే,
దేవి దేవి మహాదేవి మమ శత్రూన్వినాశయ. ౫౬
త్రికాలం రక్ష మాం దేవి పఠతాం పాపనాశనమ్,
సర్వశత్రుక్షయకరం సర్వవ్యాధి వినాశనమ్. ౫౭
ఇదం తు కవచం జ్ఞాత్వా జపేత్ప్రత్యంగిరాబుచమ్,
శతలక్షం ప్రజప్త్వాపి తస్య విద్యా న సిధ్యతి. ౫౮
మన్త్రస్వరూప కవచ మేక కాలం పఠేద్యది,
భద్రకాళీ ప్రసన్నాత్మా సర్వాభీష్టం దదాతి హి. ౫౯
మహాపన్నో మహారోగీ మహాగ్రన్థ్యాది పీడనే,
కవచం ప్రథమం జప్త్వా పశ్చాద్భృగ్జపమాచరేత్. ౬౦
పక్షమాత్రాత్సర్వరోగా నశ్యంత్యేవ హి నిశ్చయమ్,
మహాధన ప్రదం పుంసాం మహాదుస్స్వప్న నాశనమ్. ౬౧
సర్వమంగళదం నిత్య వాంఛితార్థ ఫలప్రదమ్,
కృత్యాది ప్రేషితే గ్రస్తే పురస్తాజ్జుహుయాద్యది. ౬౨
ప్రేషితం ప్రాప్య ఝడితి వినాశం ప్రదదాతి హి,
స్వగృహోక్తవిధానేన ప్రతిష్ఠాప్య హుతాశనమ్. ౬౩

త్రికోణకుండే చావాహ్యా షోడశైరుపచారతః,
యో మే కరోతి మన్త్రేణ ఖట్ప్రజ్జహీతి మంత్రతః. ౬౪
హునే దయుతమాత్రేణ యన్త్రస్య పురతో ద్విజః,
క్షణాదావేశ మాప్నోతి భూతగ్రస్తకళేబరే. ౬౫
విభీతకమపామార్గం విషవృక్ష సముద్భవమ్,
గుళూచీం వికతం కాంతమంకోలం నింబవృక్షకమ్. ౬౬
త్రికటుం సర్ష పం శిగ్రుం లశునం భ్రామకం ఫలమ్,
పంచ ఋగ్భిస్సుసంపాద్య ఆచార్య సహితశ్శుచిః. ౬౭
దినమేక సహస్రం తు హునేద్ధ్యాన పురస్సరః,
సర్వారిష్ట స్సర్వశాంతిః భవిష్యతి న సంశయః. ౬౮
శత్రుకృత్యే చైవమేవ హునేద్యది సమాహితః,
స శత్రుర్మిత్ర పుత్రాదియుక్తో యమపురీం వ్రజేత్. ౬౯
బ్రహ్మాపి రక్షితుం నైవ శక్తః ప్రతినివర్తనే,
మహత్కార్య సమాయోగే ఏవమేవం సమాచరేత్. ౭౦
తత్కార్యం సఫలం ప్రాప్య వాంఛితాన్ లభతే సుధీః,
ఇదం రహస్యం దేవేశి మంత్రయుక్తం తవాన ఘే. ౭౧
శిష్యాయ భక్తి యుక్తాయ వక్తవ్యం నాన్యమేవ హి,
నికుంభిళామింద్రజితా కృతం జయ రిపుక్షయే. ౭౨

ఇతి శ్రీ మహాలక్ష్మీతన్త్రే ప్రత్యక్షసిద్ధి ప్రదే ఉమామహేశ్వర సంవాదే
శ్రీ శంకరేణ విరచితే శ్రీ ప్రత్యంగిరా కవచమ్.



సాహితీ సార్వభౌమ, సరస్వతీ కంఠాభరణ, అవధానిశేఖర
ఆశుకవి చక్రవర్తి, రూపక సమ్రాట్, కవితా సుధాకర
కవిమల్ల, కవి కులపతి

## డాక్టర్ ప్రసాదరాయకులపతి



కవి నుండి ఋషి - ఋషి నుండి యతి,
యతి నుండి పీఠాధిపతి - నేడు -

పరమహంస - పరివ్రాజకాచార్య - జగద్గురు

## శ్రీ శ్రీ శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి

బృందావనేశ్వరి శ్రీ రాధ కరుణించి
తన దర్శనంబు - మంత్రంబు నొసగె

వజ్ర వైరోచని - భద్ర - దుర్గా సఖి
నిరతంబు రక్షగా నిలిచి యుండె

దివి నుండి బొమ్మయై దిగి వచ్చి కాళిక
షట్ శతాబ్దంబుల చరిత జెప్పె

పిలిచి సిద్ధేశ్వరీ పీఠాధి దేవత
కుర్తాళ మఠ జగద్గురుని జేసె

అతడు సామాన్యుడే జగద్ధితము కొరకు
దేవతలు పంపవచ్చిన దివ్యుడెవరో !
జ్ఞానియును - యోగి - కవిలోక చక్రవర్తి
అతడు సిద్ధేశ్వరానంద యతివరుండు.



Sri Sai Sree Printers Lakshmipuram 1st Line Cell. 9848232225